చేకూరిన వానికి వాని వినిర్మల చిత్తములో, వినిర్మలదర్పణములో వస్తుచ్ఛాయవలె బరమాత్మ వస్తుచ్ఛాయ ప్రతిబింబించును. దీనితో నిట్టి వానికి నైహిక వాంఛా రాహిత్యము, మోక్షపురుషార్థసిద్ధియుఁ జేకూరును. ఇట్టి జీవన్ముక్తునికి బ్రహ్మానందానుభవ ప్రాప్తి సులభమే యగును.

కనుక నో పాఠకులారా! దురభిమానాదులతోఁ దమ సాటి వారిని, దమసాటి మతములను నేవగించుకొనుట కేవల భ్రమ మూలము, దుఃఖమూలము నగుననియు, నిట్టి దురభిమానము వీడి సత్త్వవృత్తితో మహాత్ముల యుపదేశములను మన్నించి యాచరించు వారు దుష్యంతునివలె నభ్యుదయపథము నందుకొనగలరనియు నహంకారావిష్టులై యున్నంతవఱకు భ్రమప్రమాదాయాస కష్ట నష్టాదులకు లోనగుచుందురనియుఁ గాన మొదటినుండియు సత్త్వలాభమునకు యత్నించుచు, తమ తమ వృత్తులతో సుఖజీవనులై తుదకు "చిత్తశుద్ధి" వడసి పరమాత్మజ్ఞాన ప్రాప్తితోఁ జరితార్థజన్ము లగుటయే మానవజన్మకు ఫల మనియు మన కాళిదాస కవీంద్రుని కమనీయ కావ్యలక్ష్మి ప్రబోధించుచున్నది. ఇది యధికార తారతమ్యమును బట్టి ముఖ్యార్థముచే మనల నైహికానందయుతులుగను, వ్యంగ్యముగ నాముష్మికానందయుతులుగను జేసి, యిటు సర్వజనమనోరంజకముగ దన సరస సుందర సుమధుర సుకుమార సూక్తులచే ప్రమోదకరముగఁ లోకము నిట్లు ప్రబోధించుచున్నది. కనుకనే యాలంకారికు లిట్టి మహాకవుల కావ్యలక్ష్మిని వేదపురాణాధికముగ నిట్లు కీర్తించినారు.

"య ద్వేదా త్ప్రభుసమ్మితా దధిగతం శబ్దప్రధానా చ్చిరం
య చ్చార్థప్రవణా త్పురాణవచనా దిష్టం సుహృత్సమ్మితాత్ ।
కాంతాసమ్మితయా యయా సరసతా మాపాద్య కావ్యశ్రియా
కర్తవ్యే కుతుకీ బుధో విరచిత స్తస్యై స్పృహాం కుర్మహే ॥

